## స్వప్నకుమారము

దోసెడు మల్లెమొగ్గల నధోముఖివై కొని తెచ్చితేల ? బా
లా ! సుమనోనురక్తల నయం బిటులుండునె ? తెచ్చినావుపో
వాసన జూడుమంచు బలవంతము చేయగనేల నన్ను ? ఆ
యాసకరమ్ము లయ్యెడు సుమా ! భవదీయ విచిత్రవర్తనల్.

నిసి సగమాయె నిద్దు నవనీతమతీ ! దెసలందు నెందు మా
నిసి చను జాడలేదు, శయనించె గులాయములన్ శకుంతముల్
వ్యసన కలంకితుండగు మృగాంకితుడున్ ప్రసవాభిజాత్యలా
లసలయి యున్న పుష్పవతులన్ చెఱబట్టగరాదు దాపులన్. ౨

ధవళదుకూలకీలితనితంబము లాశల రాపువెట్ట బాం
ధవిరో ! నిశీథమం దిటులు తారసిలం గతమేమి ? సందియం
బవునుగదమ్మ ! యీ వరుస లామనితోటల, ప్రేమరోచిరు
త్సవ మగు మోమునెత్తి కలతల్ విడిపోవ ననుగ్రహింపవే. ౩

శశి నుదాసించు నీ శుభాస్యమున కేల
జాఱు ముసుగు గీలించితో చనవులాడి !
కటికిచీకటి పడి తేట చిటులు ననియొ ?
లలిత సౌందర్య రాజ్య మలభ్యమనియొ ? ౪

చదలు వెన్నెలు లల్లుచున్నది, కుమార
చాపలము లేదు పవనసంచాలనమున,
దరులు తన్నెడి కోనేటి కెరటములను
శ్రావ్య మేళన శ్రుతి వినరాదు రమణి ! ౫

తలపయి వ్రాలునట్టుల నితంబిని ! తారక లూగుచున్న వా
వలి మొగమేల పెట్టెదు, ప్రపన్నుడ కన్నుల బ్రేముడింపు, మ
గ్గలమగు విస్మయవ్యథలు కాల్చుచునున్నవి ! నమ్మవేని పూ
వులుగల చెట్లక్రింద మధువుఁ జవిజూచుచు బాసచేసెదఁ. ౬

ముసుగు సడలించి, తూరుపు
దెస నరసెద వేటికో ముదిత ! యార్తిమలీ
మసుని కటాక్షింపుము, ప్రే
మ సరళమగు ఆడుదాని మన సగపడగఁ. ౭

వలచిన ప్రాణవల్లభు డెవండయినఁ బ్రతిమాల వచ్చితో ?
నిలుపగరాని కాంక్ష నవనీత దయాగుణశాలి నొక్కనిఁ
పిలిచితొ యీ వనమ్మునకు ? బింబఫలాధర ! యర్ధరాత్రి వే
ళల నిదురించువీణ లిటులం గదలించితి వేల గోలవై ? ౮

పువులను కోయగ వచ్చితొ ?
నవకపు టంటుల హరింప నడయాడెదొ ! ప్రా
భవశాలిని ! యేకతమ ని
టు విశాలములయిన తోట డొంకల కెలనన్. ౯

వ్రాలిన సంజలన్ చిగురువాటిన మోహము పిక్కటిల్లగా
సోలి, వియోగశాంతి రుచిచూడగ వచ్చితొ ? యిచ్చకాలయిం
తీ ! లవలీకుమార కమనీయములైన వనాంతరమ్ములం
బాలకు లుండరంచును ప్రమాదమునంబడి తెంతదానవో ! ౧౦

మొగము చూపక మూగనోమును వహించి
కఠిన సంశయముల నొత్తి కత్తిరింతె ?
ఒరుల కన్నుల బడకుండ సురిగివచ్చి
తేమి యభిలాష గొని రమణీమతల్లి ! ౧౧

పూలు గ్రుచ్చిన సంపూర్ణ పుణ్యశీల
వేని ననుజూచి ప్రేమింపు మిందువదన !
మాలికలు త్రెంచిన అభాగ్యురాల వేని
రమ్ము పోద మీ హతమనోరథుని తోడ. ౧౨

హృదయ సౌభాగ్య మేల దాచెదవో యింక
లేదు మతి కొక్క దైవము లేమ! వినుము;
అన్యు లరయంగజాలని యాడుదాని
ప్రాణకాంతుల కేనె ప్రమాణమగుదు.

కన్యవో ? కళత్రమవో ? యెఱుగను మృగాక్షి !
చిరమనోవ్యాధి వశమయి చివికి చివికి
నవయు నను డాసి లేపి తానందముగను,
దాన గాంక్షింతు ' సాప్తపదీనమైత్రి '.

శిథిలితాశాకిరణ మొండు చిత్తవీథి
నస్తమింపక భ్రమియింప నడలుచుంటి;
ప్రియుల కందరి కతిదూరమయి, ప్రవాస
ఖేదమున దివసములు లెక్కించుకొనుచు.

చింతాపుష్పము లేఱుచు
కాంతా! ప్రణయోపవాసక వ్రతినై యే
కాంత మనోహింస ననుభ
వింతు నిరర్థకపు కామవృక్షము పొంతఁ.

స్నాయురుచ్ఛేద మయిన కష్టములయందు
మధురసుఖము లాస్వాదించు శిథిలహృదయ
లెవరొ ? వారల కంజలి నిడుదు పడతి !
వినగలారు వారె మదీయ విఫలగీతి. ౧౭

మనసును వెన్నబోలె సుకుమారముగా కరగింపజాలు మో
హనమగు ప్రేమభాగ్యసుఖమందగ నోచిన ధన్యురాల వౌ
దె నెలత ! ఒక్కమాట వచియించి కృతార్థుని చేయవమ్మ చా
లని యురిత్రాళ్ళ నేటికి గళాన బిగించెదు సంశయమ్ములఁ.

చేతిమీదుగా త్రవ్విన చిన్నసరసి
మునిగి తేల కదృశ్యుడౌ పుణ్యు డెవడొ ?
ఇసుకపడి పూడిపోయిన నేడ్వబోడు,
తోవలు తమ్ములు లేవని దుఃఖపడడు. ౧౮

చెలియాపూయగరానిపూపొదను పూచెంగ్రొత్త పుష్పమ్ము, మా
పుల నీరెత్తెడి ముగ్ధుడొక్కడు తలంపుల్ నిల్పె నా మొగ్గపై,
చెలువమ్ముఁ వలపుఁ తదాదిగ వృథా జీర్ణించి జీర్ణించి శో
షిలి శాంతింపగ నున్న, వేమిగలదో చెప్పంగ ప్రేమావధిఁ.

మొగ్గకట్టిన తొలికారు మోజు సయిచి,
రేకులెత్తిన మోహనఋతువు గడిపి,
కుసుమదశ కయి యుత్కంఠ గొనిన యోర్పు
తుది కృశించెడి నిట్టూర్పు తోనె యిటుల. ౨౧

చేయి కడగంటి కడ్డము జేసి చూపు
సైగ లిచ్చి లాలించిన చంచలాక్షి
భ్రాంతి నల్లాడ ద్రోసి మార్గమును మార్చె;
ఛిన్నహృదయుల కేటి వాంఛితము లతివ! ౨౨

కడుపునకన్న తల్లితమకమ్ము శమించునుగాక కొంత, యె
క్కుడయిన దత్తకాంతు కొడుకో! కొడుకో! యని ప్రాణమంతయు
న్విడిచిన మోహపుంజనిని ప్రేమయు లేబరమౌనుగాక, క
ట్టడి ప్రియురాలి రాగమకటా! కటువౌనె కుమారుపాలిటన్.

ప్రణయశైథిల్యతీవ్రతాపమున కేల
బలవ దనఃతాప బాధ తోడ్పడెడు పడతి?
గాయములులేని నెత్తురు గడ్డ లయిన
ఈవగపు గంటు లెటు శమియింపగలవొ? ౨౪

కాఁమ్యకుసుమముల్ పూఁచు సంకల్పలతలు
కడు బలాత్కారముగ త్రెంపబడియె విధిని,
ఇక నిరాశానిదాఘ మాఱక జ్వలించి
ముగుద! వాడింపవలయు సమూలముగను. ౨౫

కన్నెవిరులు సమర్తాడు కాలమందు
కొసరి కొసరి పాటలు పాడు కోకిలంబు,
కొమ్మ లనురాగరజ్జులు కుత్తుకలకు
పెనచుకొని స్రుక్కు వేళ కన్పింపదేమొ? ౨౬

కందళించు కాంక్షాతరంగముల తేల్చి
పరవశ మొనర్చు నభిమతప్రాప్తి నెంచి,
బాష్పముక్తాళి నర్పింతు ప్రణయదేవి
నీ వనాంతరమందు ఇందీవరాక్షి! ౨౭

సిగ్గునుచిన్నరికము వెను
మొగ్గగ, పొలివోని స్నేహమోహానదశలఁ
మ్రగ్గుచు, చేతికి నోటికి
నెగ్గెఱుగని చెలుము లేమి యితరము లరయుఁ. ౨౮

ఇంటిలోని పూజ్యుల నెల్ల నేమరించి
వెలుగు దీపిక నార్పితిమి లలితాంగి !
ప్రణయరేఖయు, నాశాకిరణము నంత
కటికి చీకట్లపాలయి కానరావు ! ౨౯

హృదయము పరిక్షతం బయినది లతాంగి !
భావ మపరిక్షతముగ కాపాడికొంటి,
దైవమును ప్రసన్నునిచేయ దగునుగాక
దోషమతుల నమ్మించుట దుర్లభంబు. ౩౦

చవితి నెలవంక యయ్యో నా సకియ చెలిమి
రాగశుకము పీడాపంజరమున బడియె,
భావగీతము నిక రచింపంగ నేమొ ?
చెప్పు సకియయు, పాడెడు చిలుక లేక. ౩౧

వలపుతీపుల నైన, నెవ్వగల నైన,
వ్రతనిరతినైన, ప్రణయప్రపత్తినైన,
నీకుమారదీనునితోడ నించుకంత
పాలు పంచుకో గల వేని పలుకు మబల ! ౩౨

ఆస తీఱక క్షోభించు ప్రాణివితతి
శూన్యసంబంధ మాశ్రయించుట యఘుంబు,
తుల్యరక్తి, తుల్యావస్థ, తుల్యదశల,
నొక డయిన లేక పొసగ దన్యోన్యమైత్రి. ३३

నింగి విసరిన యొడిసెల రంగుబెడ్డ
బోలె వ్రాలెడు చక్కదనాల చుక్క,
ఆకులీనలు నారాగ మాలకించి
వంశముల నిచ్చు దీర్ఘనిశ్వాస మదిగో. ३४

గగన నికేతనమ్ముపయి కప్పిన తెల్లని పాలపెంకు ల
ట్లగపడు ధౌతమేఘశకలావళి చూడుము, కప్పు జీరు వా
ఱగ దిగియున్న చీకటితెరల్ పెడకేగెడు నింక జాములో,
సుగుణవతీ! సుధాకిరణసూత్రధరుం డుదయించు నీ దెసన్.

అనుటయు నాచెలువ తటా
లున నులికిపడి భ్రమతో నలుగడల నెదియో
కను లెత్తిచూచుచున్ కద
లెను నా దండ విడిపించి లేగవు నడరన్. ३౬

మదవ దళిపుత్రు మేల్కొల్పు మధుసుగంధ
మవల నాతని చెఱకు పాలవు విధాన,
నన్ను లేపిన యాకాంత తన్ను విడక
తగులు నా నీడబెడదకు తప్పదయ్యె. ౩౭

అవశమయి జీర్ణహృదయము
మివులు నగమ్యంపు తమిని, మెలమెల్లన నా
చివురాకుబోణి యడుగుల
గవయంబోయి యిటులంటి గద్గద భణితిన్. ౩౮

అదరు చరణమ్ముల నటించు నందెరవళి
పులుగు పొలతుల నెల్ల మేల్కొలుప గలదు;
వలదు! వల దేమిటికి తొట్రుపాటు పడతి!
నడల తడబడె దీ వనాంతరమునందు. ౩౯

దవ్వవలె నార్ద్ర మయిన చిత్తమును తరుణి!
ఆస లనెడి మెత్తని పొర లల్లి కొనియె,
ఋతుహితము గాని విస్ఫార వింతవఱకు
తిన్నగాతీసి పొమ్ము నీ పున్నె మగును. ౪౦

అపుడపుడె కానబడె తూ
రుపుదెస పొడుపొందు చందరుని చిన్నెలు, నా
విపులాయతాక్షితో నా
యపలాపము ముగియు సరికె యవ్యవహితమై. ౪౧

పది బాఱల దూరం బు
న్నది యామెకు నాకు నడుమ, నాఱుమడుల్కై
కదలికల బోవు సొనయు క
లదు పచ్చనిమొక్క లొడ్డులను చెలువారఁ. ౪౨

మసకమసక వెన్నెల లెల్ల మైలబాసి
అంతకంతకు తెరదీసె నాకసమున,
చూడ గలిగితి నంతట చోద్యముగను
ఆ ముదిత వాలకము మనోహరము గాగ. ౪౩

కెలకుల పాఱుచున్న కులికింపుసొనన్ కడగంట జూచుచున్
తొలకరిపూత పూచిన మనోజ్ఞపు తీవల పూలు గ్లిక్రొం,
చలసగతిన్ విలాస మెలయఁ మెలమెల్లన బోయె పిల్చినం
బలుకక యా శుభాంగి తలవంచి ముసుంగులుజాఱ నీడ్చుచుఁ.

ఒక పెడకు వ్రాలు శిరసును
చకిత వ్యత్యస్తమయిన చరణ సరణియుఁ,
ముకుళములు గిల్లు సొగసును,
తెకతెక లాడించె నన్ను తీవరపు తమిఁ. ౪౫

కాంతరూపమె రసవదాకర్షణంబు,
అందు సంవృతశృంగారముం దొలంకు
ముద్దువేస మాద్యంత సంమోహనంబు,
కృష్ణనిశల సాంగత్య మిం కేమి చెప్ప! ౪౬

ఆసలెల్ల గ్రీష్మ ప్రవాహముల పగిది
సన్నగిల్ల శోషిలిన నాస్వాంతభూమి,
రాగమృగతృష్ణ లడరి యారాటపెట్ట
పగిలె పాపపుణ్యకవాటపక్షయుగళి. ౪౭

దెసలు శూన్యమ్ములయి, శూన్యదీప మయిన
పారవశ్య సాగరమున బడిన యెడద,
మోహ మనెడి చుక్కానికొమ్మునకు చిక్కి
ఎట్లు త్రిప్పిన తిరుగు తా నట్లు బళిర! ౪౮

కన్నమమతను, కన్నుల గన్నకాంతు
కఱకు పెడబాటుగొడ్డండ్రు నటికివేయ,
కటు మనోహింస పాలయి కలగు నన్ను,
చేరె ననిమిత్తకరుణ నే స్నిగ్ధహృదయ. ౪౯

ఆ దయావతి సహవాస మాస గొంటి
విషయచాపలవశమైన వికలబుద్ధి,
ప్రకృతి గర్వోదయుం డయ్యె భ్రమయు పురుషు
డకట ! యెంతటి యవివేకి ప్రకృతిపట్ల. ౫౦

కొంత దూరముపోయి యాకాంత నిలిచె
నీడజూచి భ్రమించిన లేడివోలె,
అంతలో చేర నరిగి జం కింత లేక
ముసుగు చెఱుగుకై కొంటి కాబోలు నేను. ౫౧

చెలియ ముసుంగుతీసి దయసేయదుగాని మొగమ్ము, ప్రేమలీ
లలుగలదానివోలె "నిటులన్ నను నేటికి వెంటనంట ? చం
చలమతి ! రాగభోగసరసమ్ములకున్ వెలియైననీకు నే
ఫలము రుచించు" నంచు కలవాణి బయల్పడ పల్కెనింపుగన్.

నడిరేయి నా చెయిదముల
కెడదఁ గలుషింప, కార్ద్రహృదయపు సరణిఁ
నుడివిన యాయమ నారసి
పడతీ! మోమిచ్చి పలుకవలదో యంటిఁ. ౫౩

అనుటయు నించుక తాపము
వినబడ వచియించె నిట్లు, "ప్రియశీలుడ! యే
మనవచ్చు నీదు కోరిక
మన సీయక మోమునిచ్చు మలినలు కలరే." ౫౪

పూలు పూయింతు సంపూర్ణముగను; కాని
గ్రుచ్చు భాగ్యముఁ ద్రెంచెడు ఘోష గూడ
కాంచుచుందును కడు ననుకంపతోడ
నచటచట నిన్ను బోలువా రనుభవింప. ౫౫

నాటకయి శ్రుతి యయిన వీణాసజీవ
తంత్రు లానందభైరవిఁ దనుప గలవె?
జీర్ణకుసుమసన్నిధి రుచించిన విదగ్ధు
నకు, ప్రసూతశోభన మేమిటికి తలంప. ౫౬

పూలబిడ్డల ప్రీతి నుయ్యాల లూచు
పవను డెఱుగడు తొడిమలు వదలు ననుచు,
తలపులకు విరుద్ధములై ఫలితములకు
బాధ్యులెవ్వరో ? పుణ్య పాపమ్ము లేవొ ? ౫౭

నవకము గ్రుంగిపో ప్రియమునన్ ప్రసవించుభరమ్ముమాత్రమే
లవలికవంతుగాక, అవలన్ తదనూన సుమమ్ము లాప్తబాం
ధవిజడ నందగించునొ ? వృథాపడిపోవునొ ! దేవపూజ పా
లవునొ? యెఱుంగజాలదు, రహస్యము లిట్టివెసుమ్మి సృష్టిలోన్.

పిలిచి బ్రతిమాలి పాలీయగలను గాని
పాలు గొనుటకు నే యోగ్యురాల గాను,
ఆప్తు లంపిన వా రుపాయనము నీకు
స్వీకరింపు మీ మధుపాత్ర చిన్నవాడ ! ౫౯

అనుచు ముసు గెడబోవంగ హస్త మింత
చాచి యందిచ్చె నా కొక్క స్వర్ణపాత్ర,
తీసికొంటి నేనును క్రొత్త యాసలెత్త
అంతయు నపస్మారమయ్యె నొక్కింతలోనె. ౬౦

చూచుచుండియుఁ గన్నులు చూడవయ్యె,
తలచుచుండియుఁ దలపులు తలచవయ్యె,
పరమ శూన్యం బయిన యా యవస్థయందు
పట్టికొంటి దృశ్యాదృశ్యభావ మొకటి. ౬౧

క్షీణచంద్రికలను బ్రకాశించు రేయి
నాకు కాటుక పూసెనో నాగతోచె :
మెఱపు మెఱసిన ట్లైన వెల్తురున గంటి
అడుగులు కదిల్చి పోవుచున్నట్లు సతిని. ౬౨

అపు డెదియు తోపని మనస్సు నాపలేక
మఱల దరియంగబోయి, కోమలి కరంబు
నొడిసి గైకొని యిట్లంటి సుడియు వగల—
"కనుల యెదుట నిరాశచే కాల్పఁ దగునె?" ౬౩

కాని యీసారి గూడ నా కావరమున
కాదరమె శిక్షగా నవ్వుచా శుభాంగి,
"కనుల యెదుట నా రూపమ్ము కష్టమేని
అవలబోయెద సుఖముండు" మని వచించె. ౬౪

ఐనను మదీయచాపల్య మడగదయ్యె,
చెలువ ముఖబింబమందు చూపులు లగించి
"నీ హృదయలీను జేసి మన్నింపు" మంటి
మఱల చరణార్చన మొనర్చు మనసుతోడ. ౬౫

అంతట శుభాస్య అనసూయ యగుచు వింత
లాలసము నన్ను లాలింప "తాళు మిపుడు
మంచి సమయముకాదు కుమార!" యనుచు
తిన్నగాబల్కి చేయి విదిల్చి చనియె. ౬౬

హృదయమందు, వనంబందు, పొదలయందు,
ఆకసంబందు, భువియందు, ఆశలందు,
తీగలందు నిశ్శబ్దమే తాండవించె ;
ప్రకృతి ధ్యానస్తిమిత యైన పగిది నపుడు. ౬౭

చీమ చిటుకుమన్నను చెవుల్ చీలిపోవు
తతనిరాకుల సమ్మూర్ఛ తనరె నపుడు,
వినబడియె నాతిదూరాన విస్ఫుటముగ
జలము పాయలిచ్చు ప్రపాతశబ్ద మొకటి. ౬౮

వెలుగేది కికారణ్యము
తలపించిన నాదు భావతలి నపుడపుడే
మొలకెత్తగ సాగెను, స్మృతి
బలకిరణము లల్లనల్ల వ్యక్తి యొసంగన్. ౬౯

మఱలన్ కానగవచ్చె నాదు ప్రణయమ్లానాశ్రునేత్రాళికిన్
చిరమాంగల్యములై, సదాపరిచయస్నేహ ప్రదీప్తమ్ములై
తరుణచ్ఛాయలతో వనస్పతులు ; పొంతంబాఱు క్రొవ్వాకయున్
సరసాలాడుచునుండె వెన్నెలలతో శైత్యసాకల్యమై. ౭౦

వనకుమారిక లుంచిన పసుపు ముద్ద
లో యనగ ఆకు మఱుగుల సోయగించు
పండ్లు కనబడె మఱల నెప్పటి విధాన
తీయ నారింజ పాదుల చాయలందు. ౭౧

చెంపకు వంగిన సీతాఫలపుచెట్లు
కెత్తుపెట్టిన యూపు లిడు వెదుళ్ళు,
చేమంతి మడి కమర్చిన త్రాటితూముల
కడ పెల్లగిలిన చక్కని కుదుళ్ళు,

దొరువు క్రీదరికి పొందుగప్రాలి నీటి ము
త్యాలపూజలు సేయు దబ్బచెట్లు,
ఇఱుకైన కంచెల నొరయు కాలువగట్ల
మువ్వలేయు అనంటి మొక్క చాళ్ళు,

అచ్చ టచ్చట మునుపటియట్లె తోచె,
వెన్నెలలు గూడ కనులకు వెన్నరాచె
పరిచయ కులాయ మెడలిన పావురమ్ము
పగిది నా మదియును వచ్చె వనికి మఱల. ౨౨

కావలెనంచు కోరిన ఒకానొక పచ్చని నిమ్మపండు, చెం
గావిపయంటకొంగు లెడగా బడ పందిలి నెక్కి కోసి లీ
లావతి నా కొసంగినటులఁ పలుస్వప్నము లెందు గంటినో;
ఆ విషమ ప్రదేశము కటా! తిలకించితిబో పునర్వ్యథఁ. ౨౩

చదువుల పాలవెల్లి, వికసన్నయవల్లి, అనుంగుచెల్లి, శా
రదవలె శృంగగీతలను రాగముతో పఠియింప, పిన్నియుఁ
కదలక యాలకించెడు వగల్ తలపోసితి నెందునిల్చి యా
కొదమవనమ్ములో, అచటకుఁ పరువెత్తె మనమ్ము క్రమ్మఱఁ.

కుచ్చుపిట్టలు బంగారు పిచ్చుకలును
వచ్చి పాటలు పాడునఁ బిచ్చివగల,
తెచ్చి వ్రేలాడదీసిన తృణకులాయ
పజ్జ్కె నెక్కడి వక్కడే వఱలుచుండె. ౨౫

కాని యేవంక వెదకినఁ గానరాదు
నాదు హృదయముతోడ నా వేదనయును
మేలుకొలిపిన యా చిత్రశీల యకట !
కటకటం బడితిని దైవఘటన నెంచి. ౨౬

మర్మ మార్దవ నిర్దహ్యమాన మయ్యొ
క్రమ్మఱ యథా మనోవ్యథా కర్కశార్తి;
అలలు రేగిన తామరకొలను మాద్రి
నెడద త్రెక్కొన నుత్కంఠ వెడలె నిట్లు. ౨౭

శ్యామా! శ్యామలతామలమ్మగు ప్రవాసస్నాన పుణ్యోచక
శ్రీమద్వాటికలఁ, వియోగపదవీ చింతారహస్యార్థినై,
ప్రేమారాధన మాచరింతు, లలితార్తి స్వేద లీలాదశల్,
కౌమారార్పణమంచు, బాష్పకణ ముక్తామాలికఁ ద్రిప్పుచుఁ.

ఎవరు లేని గవాక్షసంవృతతలాన
నను పిలిచి బందమేసె సుందరి యొకర్తు
తెల్ల సురపొన్న పూల సంకెళ్ళతోడ,
ఇందులకు దైవ మొకడే యదృష్టసాక్షి. ౭౯

చేతిలో చేయివైచి నన్ చెప్పు మనియె
తీయని యెలుంగుతో "నివి త్రెంప ననుచు",
త్రెంచలే నెట్టులో సహియించు వాడ
సన్నగిల్లు హస్తమునుండి జాఱుదాక. ౮౦

వలపుల చెమ్మగిల్లిన స్వభావముతో అభిమానచేల మిం
పొలయగ కప్పికొన్న ప్రణయుఁ భ్రమపెట్టితి వింతెకాని యో
కలికి! వియోగవహ్నికణికల్ దహియించిన ప్రేమభస్మమం
దెలసిన యా యదృష్టలిపి నింత పఠింపకపోయి తక్కటా! ౮౧

భ్రమసి యారాటపడిన క్రొవ్వాడివలపు
లెపు డతీవదురాపవిక్కృతము లయ్యె,
అపుడె సుఖదుఃఖసూత్ర మవ్యవహితముగ
భావగతుల బంధించె భామావతంస! ౮౨

అదిమొదల లీవివిక్తతలమందు మదీయ కవోష్ణబాష్పముల్
తుది సికతాపగాజలముతో కలియఁగా విడిపించు, చూరుపుల్
మృదుల సుగంధవాతముల నేకముచేయుచు, నిష్ప్రమోద సం
పదల నెఱుంగువాడ సహవాసులదుఃఖము పంచుకొన్ వగన్. ౨౩

చపలచపలమయ్యె యథాస్థాయి గనని
మదికి కైవల్యభోగ సంపద ఘటించె
నే మనోహర లలనాభిరామబింబ,
మా వికాస మారాధించు టఘమె ? యవని ! ౨౪

ఆ వర్చస్విని ముద్దుమోముపయి తీయమ్మైన లజ్జాలతల్
పూవుల్ పూయ, పిసాళినవ్వు చిగిరింపుల్ నిగ్గు చెక్కిళ్ళపై
కోవల్ దీయ, రహఃప్రదేశమున నాకుఁ నేరిపెఁ ప్రేమ వీ
ణావాదమ్మది మాన నేమిటికి, సౌందర్యార్చనల్ దోసమో! ౨౫

ఏకాగ్రస్థాయికి మది
నాకర్షించెడి మనోహరానందము..నే
లా కాంక్షింపగ రాదు ? ని
రాకృతములె కామవర్గ రవ్యార్చనముల్. ౨౬

అనుచును వివిక్తతలి దెస లరయలేక
తిరుగు అనపత్య హారిణంబు కరణి నేను,
చూచుచుంటిని ఆమెకై; శూన్యమయిన
ప్రకృతి నా యాత్మకు ప్రతిబింబంబు కాగ. ౫౭

మిసమిసలు మీరు మెత్తని యిసుక మీద
చంద్ర కిరణముల్ చెదరు నా సమయమందు
పలుకరించె సీతాకోక చిలుక యొకటి ;
వెంటనే వినబడె నొక్క వింతవాణి. ౫౮

మౌక్తికముల కానుపు మోయు శుక్తి కకట !
గర్భవిచ్ఛేద మే పాపకారణంబు ?
పక్వఫలములు గన్న రంభలకు ఏల
తప్పదు సమూల నాశనత్వము కుమార ! ౫౯

కారుచీకట్లు లోకముఁ గప్పె నను చు
ఏల నిందించెదవు మేఘమాలికలను ?
చూడగలవు గదోయి మంజులము లయిన
చారు చపలాలతల, దివ్య చాపరుచుల. ౬౦

శ్రావణ పయోదబాష్ప ధారాభరంబు
నెమిలి కన్నియలకు దర్శనీయ మేని,
ఆకుపచ్చ కోకలఋతు వవనికేని,
పడ్వు గూడ ప్రియంబు కాదేమి పుత్ర! ౯౧

చెరపిన మాసిపోని లిపిచే లిఖియించె రహస్యపంక్తి నే
మురిపెపుబొమ్మ నీహృదయపుస్తకమందున; నా యమూల్యసుం
దరపుటచించి కైకొనిరి తస్కరులెవ్వరో? వారి రోయ కీ
చెఱ కిటు లీవు పాల్పడె దసీ! యనిమిత్తవికారశాలివై. ౯౨

దప్పిగొని చేరిన మిళింద తనయులకును
పూలపాలిచ్చి చీకట్ల పోవకుండ
కడుపులో దాచుకొనెద పంకజము ప్రియుడ!
చేరదీసిన మమకార మేరి కెఱుక! ౯౩

గండ్రగొడ్డలిచే నఱకంగ దరియు
నిర్దయునకు చల్లని నీడనే యొసంగు
ఫలవదార్ద్రధాత్రీజాతములు కుమార!
ఇంత యాశ్రయ వాత్సల్య మేమి తెలియ? ౯౪

పొదుగు నొవ్వంగ బాధించు ముద్దులేగ
ఒడలు నాకెడి గోసాధ్వి యోర్పదెంతొ !
బాధ సళుపరించిన గాని స్వాదు వయిన
ప్రేమ మాధుర్యము రుచింప దేమొ పుత్ర ! ౯౫

మాయపొరలు జాఱిన సుకుమార శిశువు
నోరుతెఱచి యేడ్చెడిని యెందులకొ గాని ?
అంపకపు పెండ్లికూతు కన్నార జూచి
నిలుప లేదేమిటికి తల్లి నిండుయేడ్పు ? ౯౬

పడకటిలు చూచి యేడ్చు జవ్వని యొకర్తు,
చనినదెస చూచి యేడ్చు జనని యొకర్తు,
తనసొగసు చూచి యేడ్చు సుందరి యొకర్తు,
ఏడ్పును ప్రియోపసర్జనీకృతము కాదె. ౯౭

ఎండలో మాడిపోవు లేయిగురు లరసి
యేడ్చు నదుల ప్రేమోదంత మెవ్వ డెఱుగు ?
నీళ్ళ తరగల రేల్బవల్ నృత్యమాడు
చంద్రసూర్యులు సైతము జాలిగొనరు. ౯౮

కార్శ్యసకలంకి యగు సుధాకరుడు చల్లు
చంద్రికల నేమి కలుషదోషములు కలవు?
నిండుచేళ్ళ జలంబు నిందింతు వోయి
తేటిపాటు దటించు కుమారమౌళి! ౯౯

విషరదన లైన త్రాచుగుబ్బెతల నేల
నయనసమ్మోహనాంగ సుందరుల చేసె?
మధురగానాభిముఖమైన మంజుహృదియు,
శిరసురతనము లే పుణ్యవరము లిచ్చె? ౧౦౦

క్షణిక మను చెటింగియును దిక్చక్రకంఠ
సూత్ర మగు ఇంద్రచాపముఁ జూడకుందె?
ఉన్నతస్వర్గ సోపాన యోగకాంతు
లప్పుడైన నంకుర మగు నంతె చాలు. ౧౦౧

తుమ్మెదలు క్రక్కెననుచు మధువు త్యజించు
భావము విరక్తి కాబోదు పడుచువాడ!
జలము మలినము లగుట నైజంబ యేని,
ఏల యవిభాజ్యబుద్ధి నూహింపలేవు? ౧౦౨

కోమల ప్రేమ సంపూర్ణకుసుమదళల
నలరు నపుడె దుఃఖరజస్సు స్ఖలితమగును;
వర్ష ధారల కడుగంగబడిన పొలమె
ఆర్ద్ర మయి పచ్చబడు నంచు నరయలేరె? ౧౦౩

ఎంతకామింతొ దుఃఖింతు వంతచేటు
ఎంత దీపమొ నీడయు నంతకాదె;
పరిమితియు ననుబంధముఁ సరిసమంబె
ప్రేమ పెనుచు నేడుపు నింక విడువనేల? ౧౦౪

ప్రణయ సౌభాగ్యవిరహాభార ప్రసన్న
మయిన నీయాత్మ యేల కాటియపడంగ!
అనుభవింపు ప్రేమోచ్ఛిష్టమును కుమార!
అంటు లేదని నీయాప్తు లంపినారు. ౧౦౫

భావ మొకచోట నిలువ పూబంద మేసె
నే మనోహారి, ఆ ముగ్ధ మోము జూచి,
స్వరము నాలించి, ప్రేమ కంజలియొసంగు,
మెల్ల ప్రాణుల కాప్తుడనేయటంచు. ౧౦౬

ప్రకృతి యెల్ల ప్రవాసచారమె భరించు
నిత్యకళ్యాణపికసాన్నిధ్య మెడలి,
చిరవియోగ సంమేళన శ్రీలెఱుంగ
నీవును ప్రవాసివే కదోయీ కుమార! ౧౦౭

కరతలీచిత్ర మగు సూత్ర మరసి పుత్ర!
కుసుమములు తెచ్చితిని దండ గ్రుత్తువనుచు,
అనెడి పలుకు క్రమక్రమాయత్తమాంద్య
లీనమైపోయె, పక్షిబాలికలు కూసె. ౧౦౮

అంత నాలోన ఒక వింతకాంతి విరిసె,
ఎదియొ! చల్లని స్పృహ యొకం డుదయ మయ్యె.
శిరసు దువ్వి జాఱెడి మాతృకరము మాడ్కి-
అవల కనులెత్తి తూరుపు టాశ జూడ. ౧౦౯

ఆ యెడ చేయిచాచి, అభయాభినయ ప్రియమైన మోమునన్
పాయెలువాఱువత్సలత పాలనుబోలె, ప్రజాస్తనంధయా
ప్యాయనమూర్తి యొందు నిలువంబడె, స్వప్న కవాటబంధముల్
తీయ స్మరించితిన్ భగవతీ ప్రకృతి స్తిమిత స్వరూపమున్.

# జడకుచ్చులు

కవితా కన్యకు
తెలుగునాడు అల్లియించిన
అందాల ఆభరణము.

కురులు దువ్వే కౌశలం
పాయలు తీసే పాటవం
పరికించండి - భావించండి.

సంజ మసకలో సఖులు కలుసుకొంటారు
ఓర్వలేని వారెవ్వరో ఒకరి నొకరు
పోల్చుకొనకుండ క్రిందికి వాల్చినారు
నీకు నాకును నడుమ ఈ నీలి తెరలు -
సెజ్జపయి పడుచుల మధ్య లజ్జలాగు.

# తృణకంకణమ్

అడుగులు బొబ్బలెత్త
వదనాంచల మందున చెమ్మటల్ మడుగులు గట్ట
జారెడు - పయంట సవరింపుచు
కాల్నడకల పోవుచుండె......తోటలోనికి
పడంతి యోర్తు ?

ఆమె కథా - కావ్యం.
పసుపు తోరం - పచ్చ తృణకంకణం.
ఆమె మిత్రుని ఆశా - నిరాశా.
నిమ్మచెట్టు పందిళ్లు - ముచ్చటైన ముద్దుటుంగరం
వారి సంభాషణ.

చక్కగా చదవండి - స్వచ్ఛందంగా ఆస్వాదించండి.

# అభినవ కవితాకృతులు

■

తృణకంకణము

కష్టకమల

స్నేహలతాదేవి

తెనుగుతోట

రమ్యాలోకము

ఆంధ్రావళి

జడకుచ్చులు

మధుకలశము

మాధురీదర్శనము

రూపనవనీతము

*

SWAPNAKUMARAMU

BY

RAYAPROLU SUBBARAO

As. 8.

అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.